ఒక్కమాటయినా అనలేదు. తవుటి పురుగు అమ్మాయిలు, డున్నోను ఆశ్చర్యంతో చూస్తూ కదలక మెదలక కూచుండి పోయారు. వారి దృష్టిలో డున్నో నిజంగా వీరుడు.

"మీ బెలూన్ మమ్మల్ని హడలుగొట్టింది," గడ్డిపువ్వు చివరికి. అంది "మేము బాల్కనీమీద టీతాగుతూవుంటే, ఒక పెద్ద బెలూన్ మా యింటిమీద పడుతూవుండడ కనిపించింది. హటాత్తుగా అది కంచమీదపడి పేలిపోయింది —ధన్‌మని. మేము దాని దగ్గరకు పరుగెత్తాము. కాని మాకు కనిపించిందల్లా కొండ దావిబెరడుతొట్టె ఒక్కటే."

"నువ్వు నేలమీద చచ్చినట్టుగా పడి వున్నావు"అని కలిపింది బుస్సీ.

"ఒకబూటు కాలికివుంది, యింకోటి కంచెమీదవుంది. నీటోపీ చెట్టు కొమ్మకు వేలాడుతూ వుంది"అంది చిస్సీ.

"నేను మంచంమీదికెలా వచ్చాను?" అని అడిగాడు డున్నో.

"మేమే వేశాము. రాత్రల్లా నిన్ను నేల మీద ఎలా వదిలిపెట్టేస్తాము?" అంది గడ్డి పువ్వు.

"నువ్వు చచ్చిపోయిన వాడిలాగా కనిపించావు" అంది బుస్సీ. "కాని నాకు బలమైన —దాన్నేమంటారు?—శరీరం వుంది గాబట్టి మళ్ళీ కోలుకుంటావ"నంది మధుకశీ.

"నిజం నాకు బలమైన శరీరంవుంది, కాని నాతలకాయ యింకా బలమైనది" అంటూ గప్పాలు కొట్టాడు డున్నో. "ఇంకెవరైనా అయివున్నట్టయితే, తప్పకుండా మెదడుకు దెబ్బతగిలి వుండేది."

"కాని బెలూన్‌లో యింకా ఎవరో వున్నారని అన్నావే?" అంది గడ్డి పువ్వు.

"అవును. పదహారుమందిమి వుండేవాళ్లం. డూనో పారచూట్‌నుండి గంతేశాడు. యిక మిగిలినవాళ్ళు పదిహేనుమంది."

"వాళ్ళెక్కడున్నారు?"అని అడిగింది మిస్సీ.

"తెలియదు" అన్నాడు డున్నో.

సరిగ్గా అప్పుడే తలుపు తెరుచుకుంది, మంచుముక్క గదిలోకి పరుగెత్తుకొచ్చింది.

"ఈ కబురు విన్నారా?" అని అరిచింది. "అతి తాజా కబురు: ఇంకో బెలూను క్రింద పడి పేలిపోయింది. దాన్లో పద్నాలుగు మంది తవుటి పురుగు కుర్రాళ్ళున్నారు. కిందటి రాత్రి ఊరి పొలిమేరల్లో వాళ్ళు పడిపోయారు. మన వాళ్ళు వాళ్లను ప్రొద్దుటేచూసి, ఆస్పత్రిలో పడేశారు."

"వాళ్ళు నాస్నేహితులై వుంటారు" అన్నాడు డున్నో. "నేను తిన్నగా ఆసుపత్రి కెళ్ళి కనుక్కుంటాను."

"నేనూ నీతో వస్తా" నంది గడ్డి పువ్వు.

---

## ప్రశ్నోత్తరాలు

# సోవియట్ దేశంలో ఫిల్ము పరిశ్రమ

*ప్రశ్న: సోవియట్ దేశంలోని ఫిల్ము పరిశ్రమ పరిస్థితి ఏమిటి? ఒకొక్క రిపబ్లిక్కులో ఎన్నెన్ని ఫిల్ము స్టుడియో లున్నాయి? సోవియట్ ఫిల్ముల మొత్తం సంఖ్య యెంత?*

—శాంతి విజ్ఞానసమితి అధ్యక్షుడు, వింత పత్రవ: రఫీగ్ అహ్మద్, అలిఘర్; పెత్రిక్ అలెస్ డెలీ మొదలైన వారు.

*జబాబు: (ఎ. ఫెదరోవ్, సోవియట్ దేశ సినిమాటోగ్రఫి కేంద్ర కార్యాలయాధిపతి).*

సోవియట్ దేశంలో వ్యక్తుల సంస్థలు లేవు. ఫిల్ము పరిశ్రమ ప్రభుత్వ యాజమాన్యాన వుంది. ప్రతి యూనియన్ రిపబ్లిక్కుకు స్వంత ఫిల్ము పరిశ్రమ వుంది. రష్యన్ సమాఖ్యా ప్రభుత్వానికి ఒక కథా చిత్రాలకు సంబంధించిన స్టుడియో, నాలుగు సులభవిజ్ఞానం స్టుడియోలూ, ఎనిమిది వార్తాచిత్రాల స్టుడియోలూ వున్నాయి. ఉక్రెయిన్‌కు రెండు కథాచిత్రాలకు సంబంధించినవి, ఒకటి వార్తా చిత్రాలది, ఒకటి సులభ విజ్ఞానానికీ స్టుడియోలున్నాయి. ఇతర రిపబ్లిక్కులకు ఒక కథా చిత్రాల స్టుడియో, వార్తా చిత్రాల స్టుడియో వున్నాయి. అన్నిటికంటె పెద్ద ఫిల్ము కర్మాగారాలు—మోస్ ఫిల్ము, గోర్కీ ఫిల్ము స్టుడియో, ప్రత్యేక ఫిల్ము స్టుడియోలైన మాస్కోలోని అనిమేటెడ్ కార్టూన్, ఎపిడియస్కోపిక్ ఫిల్ము స్టుడియోలు సోవియట్ దేశ మంతటికీ ప్రాముఖ్యం గలవి. సోవియట్ దేశంలో మొత్తం 34 ఫిల్ము స్టుడియోలున్నాయి. వాటిలో పందొమ్మిది కథా చిత్రాలనూ, మిగిలినవి వార్తా చిత్రాలనూ, సులభ విజ్ఞాన చిత్రాలనూ తయారు చేస్తాయి.

సోవియట్ దేశంలోని స్టుడియోలు 1955లో 65 కథాచిత్రాలను నిర్మించాయి. 1956లో సినిమా థియేటర్లలో దేశంలో తయారయినవి 80, యింత సంఖ్యలో విదేశాలవీ ఫిల్ములు ప్రదర్శింపబడ్డాయి. దీనికి వార్తా చిత్రాలను, సులభ విజ్ఞాన చిత్రాలనూ, విద్యా చిత్రాలనూ కలిపినట్టయితే సోవియట్ దేశంలో, 1956లో సినిమా థియేటర్లకు సుమారు రెండువేల ఫిల్ములు లభించాయి.

# తల్లులకు సలహా



## బిడ్డకు కసరత్తు

కసరత్తు 1:

బిడ్డను వెల్లికిల పరుండబెట్టి, తల్లి బిడ్డ రెండుచేతులను పట్టుకొని, ఒకదానికొకటి దూరంగా పెట్టి, బిడ్డ చేతులను ఒకదాని తర్వాత ఒకటి రొమ్ము మీదికి (బండివాని ఊపులాగా) తెస్తుంది. ఈ సాధన, రొమ్ము కండరాలను బాగా అభివృద్ధి చేస్తుంది.

కసరత్తు 2:

బిడ్డ వెల్లికల పరున్నప్పుడు, తల్లి కాళ్ళు పట్టుకొని ఒకదాని తర్వాత ఒక మోకాలును పొత్తి కడుపు వేపుకు మడత వేస్తుంటుంది (బైసికిల్ చక్రపు ఊపులాగా). ఈ సాధన కడుపు కండరాలను పెంపొందిస్తుంది. ఇది ముఖ్యంగా మలబద్ధకం, ఉబ్బుకడుపు వున్న పిల్లలకు ప్రత్యేకంగా సూచింపబడుతుంది.

కసరత్తు 3:

బిడ్డ కడుపు క్రింద ఒక చేతిని ఆధారంగా పెట్టి, రెండవ చేత్తో కాళ్ల దగ్గర పట్టుకోవాలి. (ఈతగాని ఊపు). ఈ సాధన శరీరంలోని కండరాలన్నీ బలం పొందను సహాయకారి అవుతుంది.



కసరత్తు 4:

చిన్న మెత్తమీద బిడ్డ అరచేతులు ఆనించి, ఆ చేతులమీద బిడ్డ బరువు మోపివుండగా తల్లి కాళ్ళను పట్టుకొని (ఒంటి చక్రపు త్రోపుడు బండి ఊపులో) జాగ్రత్తగా పైకెత్తుతుండాలి.

---

## విషయసూచిక



సమృద్ధమైన నూనె గనులకు నిలయమైన బురైమీ ఒయాసిస్సును (సౌదీ అరేబియా) బలాత్కారంగా వశపరచుకోను బ్రిటిష్ కంపెనీలు సాయుధ సన్నాహం చేశాయి.

—"మళ్ళీ మన ఒయాసిస్సు మందుగుండు వాసన కొడుతున్నది."

—"అవునవును వలస పెత్తందార్ల కిక్కడ నూనెవాసన కొట్టినందుకు."

చిత్రకారుడు గోర్యయేవ్ (హాస్య పత్రిక "క్రొకదిల్" నుండి పునర్ముద్రితం)

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎపిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీ నుండి సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు; పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్ల.

